12-8-19

# అభినవసరస్వతి


సంపుటము 9 | జానపాడు — పింగళ సం॥ ఆషాఢమాసము | సంచిక 7


## కృతివిమర్శనము.

1 బ్రాహ్మమతము, 2 ప్రభావతి, 3 ఆనందశతకము, 4 కర్ణభారము, 5 ఆర్యసూక్తిముక్తావళి, అందు మొదటిది పాలపర్తి నరసింహముగారిచే వ్రాయఁబడిన యొక మతగ్రంథము నూతనముగ బయలువెడలిన యీమహామతమునుగూర్చి యెవ్వరిచేతను గ్రంథము రచింపఁబడకయుండ నీయన యాలోపము దీర్చినవాఁడఁట ఇందు మాకేమియుఁ బ్రమాణము లనవసరములనియు సత్యమే ప్రమాణమనియుఁ జెప్పుచు మరల నెచ్చటేని తమ కనుకూలములుగాఁ గనఁబడు శ్రుతి స్మృతి వాక్యములు స్వీకరించి వానికేవో స్వకపోల కల్పితార్థముల వ్రాయుచువచ్చెనుగాని తచ్ఛ్రుతి స్మృత్యాదులయందలి ప్రవేశాభావముచే నీవాక్యములన్నియు నపశబ్దభూయిష్ఠములై కన్పట్టెడిని. తత్త్వవేత్తయగు నొకమహానీయుఁ డెవఁడో యద్వైతసిద్ధాంత మసత్యమై నష్టహేతువైనదనియు జీవేశ్వరులు వేఱనుదానినే వివేకులమగు మనము నేర్చుకొనవలసిన ముఖ్యసత్యమనియు నుడివెనఁట అట్టివారి వాక్యములే యీమతమునకుఁ బ్రమాణములు కాని శ్రుతి స్మృత్యాదులుకావు, కావునచు మరల నందలి యేదియో యొకవాక్యమును బ్రమాణముగాఁ గైకొనుటకు వీరి పూర్వాపర సందర్భజ్ఞానాభావమే కారణము. అన్నాతురుల కన్నమిడుటయు గుడ్డలేనివారికి గుడ్డలొసఁగుటయు నిండ్లు లేనివారి కిండ్లిచ్చుటయు బలహీనలకు సాయముచేయుటయు నగతికులకు గతికల్పించుటయుఁ జెడినవారిని బాగుపఱచుటయుఁ గ్రూరులనడంచుటయు నీశ్వరసేవయేయను నిత్యాద్యోతిన్మతాభిప్రాయములుమట్టుకు చాల మెచ్చఁదగినవియేకాని తక్కినవిమాత్రము ప్రమాణవిరుద్ధములగుట నసంగీకార్యములు కర్తవ్యాకరణమును నకర్తవ్యకరణమును దైవశాస్త్రోల్లంఘనములై పాపహేతువులగునన్నంతవఱకే మతస్థులొప్పుకొందురు కాని "శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే" యను భగవద్వాక్యమునందలి యర్థమును మాత్రము గమనింపరు క్రైస్తవ మతముగూడఁ బాపాత్ములు నరకమనుభవింతురని బోధించునటకాని యది యీబ్రహ్మమత మటులమాత్రము నంగీకరింపదఁట ఈవిషయమునుబట్టిచూడ నీమతముకంటెఁ గ్రైస్తవ మతమే కొంతమంచిదనవలసియున్నది. శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే॥ మొదలగు భగవద్వాక్యముల ననాదరించి భగవంతుఁడు మానవవేషమున భూమండలమందవతరించెనని బ్రహ్మసమాజము విశ్వసింపదఁట శ్రుతిస్మృత్యాదులు ప్రమాణములుగాక సత్యమే ప్రమాణమను నీ మతమువారెది సత్యమో యదియెట్టిస్వరూపముగలదో యేవాక్యములఁ బ్రమాణములఁగాఁ

12-8-19

12-8-21



గానవలెనో వివరింపరయిరి ఇవన్నియు నర్థశూన్యములును నసంగతములును నగ్రాహ్యములును గావున జనులీగ్రంథమును విశ్వసింపకుందురుగాక వర్ణభేదము సకలాభివృద్ధికిని భంగము వాటిల్లజేయుచున్నదఁట ఇది హాతముగునంతవఱకు బ్రహ్మసమాజము యుద్ధమునకు పూనుకొని సంసిద్ధమైయున్నదఁట బ్రాహ్మణుల మాదిగలఁజేయుటకు మాదిగల బ్రాహ్మణులఁజేయుటకు స్త్రీలఁబురుషులఁజేయుటకుఁ బురుషుల స్త్రీలఁజేయుటకు విధవల సధవలఁజేయుటకు నీబ్రాహ్మమతము బద్ధకంకణమై యలరారుచున్నయది ప్రపంచమున ననేక మతములు ప్రబలినవికాని యిట్టిమతము నెన్నఁడుం జూచి యుండము హైందవసంఘమునందలి కఠినములైన కట్టుబాటులవలనను బురోహితకోటికిఁగల యధిక ప్రాబల్యమువలనను నీబ్రహ్మసమాజము తనకార్యమును ధారాళముగఁ జేయఁజాలకుండెనఁట తథాస్తు భగవంతుఁడు నిజాన్వోలంఘనచణమైన యీసమాజమున కాహైందవసంఘమందలి కట్టుబాటులను నాపురోహితప్రాబల్యమునే యంతరాయములుగఁ జేయుఁగాక ఈబ్రాహ్మమతముకన్న శ్లో॥ సర్వాగమ్యా యోషితో మద్యమాంసం శక్యం భోక్తుం నామ యావద్వ్యపేక్షం శక్తిః పూజ్యా శాంభవీ జీవితాన్న సౌఖ్యం భూమౌ స్వర్గలోకాత్తు భూరి॥ అని చెప్పకొనెడి పాషండులమతమే సర్వథా శ్రేయము దీనివెల రు 0-6-0 లు రెండవది సూరాబత్తుల సూర్యనారాయణగారిచే రచింపఁబడిన యొకవచనకావ్యము ఇందలి యితివృత్తము ప్రభావతీప్రద్యుమ్నములోనిది శైలి చాల మనోహరమును బ్రౌఢమునునై సామాన్యుల కభేద్యమైనను బండితుల కత్యంతామోదదాయకంబయి యలరారుచున్నయది రెండవకూర్పునందయినను సవరించుకొనఁ దగినవి "అంతఃపురకేళాకూళులు, అనురాగుండవు" ననునవిశేషప నితరములు గానరావు ఇంత మంచిశైలిలో నెత్తుగడజేసిన గ్రంథము మఱికొంత పెంచి వ్రాసినచోఁ జాల బాగుగనుండెడిదికాని తగినకథావకాశమున్నను పెండులకో తుదకుసంక్షేపముచేసెను దీనివెల రు 0-4-0 లు మూడవది యష్టోత్తరశతనామాలాదివృత్తములతోఁ జేరినది ఇందేవేని స్వల్పదోషములున్నను మృదుమధురపదగుంభితమై భక్తిజ్ఞానవైరాగ్యబోధకమగుటఁ బాఠకలోకమునకుఁ బరమప్రీతిపాత్రమగుటకు సంశయములేదు దీనివెల రు 0-2-0 లు నాల్గవది భాసకవిరూపకములలో నొకటగు చిన్నిగీర్వాణకావ్యమునకు మానవల్లి రామకృష్ణకవిగారిచేఁ గావింపఁబడిన తెలుఁగు మృదుమధుర పదగుంభితంబై చదువరులకు సంతోషమొదఁగూర్పఁదగియున్నయది దీనివెల రు 0-2-0 లు ఐదవది భారతాదులలోని నీతిధర్మబోధకములగు పెక్కుపద్యములొకచోఁ జేర్చి ప్రచురింపఁబడినగ్రంథము. పద్యములన్నియు విలువగలిగినవియేయైనను నేప్రకరణమున కాప్రకరణము వేఱుగఁదీయబడని హేతువునఁ జదువరుల కవసరాంశము లగవ్యములయి గన్పట్టెడిని ఈ గ్రంథములు మానవసేవాపత్రికయందుఁ బ్రచురింపఁబడినవి ప్రకృతము మానవసేవ మాత్రము సాగుచున్నట్లు కనఁబడదు.

---

12-8-21

* తే॥ ఇంకఁ దక్కిన పాటి వీరేశలింగ
మఱువది ప్రతిష్ఠలం దాను జరిపియుంట
సత్యమేయంట, మేము తత్సాక్షిఁ గాశిసు
లోనఁ బడఁగొట్ట లేదంట దేనఁ నేని॥ 161

కం॥ మేమెఱుఁగనట్టి తత్త
ద్గ్రామములఁ బ్రతిష్ఠ లెపుడొ కావించితినం
చేమోనుడువఁగ వానిని
నేమని క్రాస్ చేయవలెనో యెఱుకపడదుగా॥ 162

కం॥ ఎవరచటధర్మకర్తలు
ఎవరెవరపు డుండిరనుచు నీ మొదలగు నె
య్యావొకద యడుగఁగవలయుట
యెవ్వ వానికి బదులుచెప్పఁగా మి యడిగిరన్॥ 163

కం॥ ఏయల్లయలోయప్పట। నాయెడవసియించగను చునతఁడు వచించున్
వ్రాయునుదానుం దీర్పున। నియవిసత్యము లెయనుచు నేమగు దానన్॥

తే॥ అంతియే కాని యాయల్లుఁడులనుదాను
కోర్టుతగఫున రప్పింపఁ గోరునొక్క-
అటుల రప్పించియరసినయపుడె సత్య
మెల్ల నాపిమ్మ కృతంబగు నెంచిచూడ॥ 165

తే॥ అట్లు సాధారణముగ న్యాయవాదు
లొనరుపరటంచు మేమును నూరకుంటి
మతఁడు చెప్పినవన్నియు న్ననృతములని
ఋజువుచేసెదనిప్పుడు ప్రజలు! కనుఁడు॥ 166

మత్తకోకిల॥ గొట్టిపాటి శివప్రతిష్ఠలు గోరి తాను యొనర్చియు

---

* ఆతనియొక్క యాత్మస్తుతి సంతృప్తులను గుఱించి యతనిని క్షమింపవచ్చునో లేదో యది యటుంచిన నతఁడు చెప్పిన గ్రామములలో నతఁడు చేసిన ప్రతిష్ఠలు నిజమైయుండును- అన్ని దేవతల పేళ్లను జెప్పుచున్నాఁడు కాశిసులో నతఁడు చేసిన ప్రతిష్ఠలవిషయమై నాకేమియూ సందేహము కనఁబడలేదు

న్నట్టులాతఁడు చెప్పియుండఁడే, యీప్రతిష్టకుఁబంపఁబ
డట్టియీ * శుభలేఖయెల్లను నాగరించిపఠింప ను
న్నట్టిసత్యము తెల్లమయ్యెడి నార్యులార ! పఠింపుఁడీ॥ 167

కం॥ అది యన్నృతంబని తెలును
గద యీ యాహ్వానపత్రికం గాంచినపై
కొదవవియు నిట్టిచేయని
మది నెంచుకుఁదలఁపఁదగదు మన మింక నేనిఁక॥ 168

ఉ॥ గ్రానిగ జెంచి యుద్యమము తప్పకసల్ప లభింపకుండ, గాఁ
గాని సమీపవర్తులగుగ్రామము లయ్యవి గాకయున్కి—

12వ సాక్షి దావాగ్రామపురైతు-40 సంవత్సరములకిందటఁ ధనయన్న చెన్నమల్లను విశ్వబ్రాహ్మణునిచేఁ బ్రతిష్ఠజరిపించినట్టును వాదికిని బ్రతివాదికిని వివాదము ప్రతివాది పతిష్ఠచేయునప్పుడువచ్చిన పైవస్తువులు పంచుకొనుటలో వచ్చినట్టును జెప్పుచున్నవాఁడు- గ్రామములోనుండు పార్టీదారులలో నితఁ డొకఁడు

* శ్రీవిశ్వేశ్వర ప్రతిష్ఠాహ్వానపత్రిక *

శ్రీమదఖిలమహీమండల మండనాయమానులును సకలవిద్వద్గణ గణనీయ గుణధురీణులును నగు శ్రీ———గారిసముఖమునకు-శ్రీవిశ్వేశ్వరపదపరాగానురేణుపూజాధురంధరుండును శ్రీహరిహరగురుప్రియశిష్యసేవకుండును శ్రీమత్ త్రిపాటిపురమండలీతిలకంబగు గొట్టపాడుయనుపురవరంబుననివసించియున్న పచ్చల వెంకటదాసయ్య విన్నవించుకొను విధేయవిజ్ఞాపనము-శ్రీమత్ త్రిపాటి మృత్యుంజయ అయ్యవార్లగారిచే నేను శ్రీమత్ స్వామికాగమోక్త ప్రకారముగాను శ్రీవిశ్వేశ్వర వీరభద్రాది ప్రతిష్ఠలను జరిగించుటకు శ్రీ దుర్ముఖినామసంవత్సర ఫాల్గుణశు 2 బుధవారము రోజున పెద్దలవల్ల సుముహూర్తము నిశ్చయింపబడి జరగబోవుచున్నది. తమరు సకుటుంబ బంధుమిత్ర సపరివారముతో తమస్వకార్యములయొక్క తిరికలను విచారింపక యిచ్చటికి వచ్చి శ్రీ శివప్రతిష్ఠలను సాధుసజ్జనుల మనఃప్రీతిగా దర్శించి నన్ను బ్రహ్మానందాప్తుని పొందింపవలయునని మిక్కిలిప్రార్థించుచున్నాడను-సుజనవిధేయుడు, పచ్చల వెంకటదాసయ్య.

గుంటూరు శ్రీధర్మసంరక్షిణీ ముద్రాక్షరశాలలో ముద్రింపబడియె

ష్ఠే నట కేగి యూరయుట కే సమకూరదు, సత్యనిష్ఠ మా
మానవకోటి కీ యొకటిమాత్రము చాలదొకో తలంపఁగన్ 169
క॥ పదుమూఁడవసాక్షికిని బదిరెండవసాక్షి కట్లు పార్టీక్రోధం
• బుదయింపకుంట వ్రాసెను సదయుండై న్యాయకర్త జడ్జిమెంటునఁ దాన్
కం॥ ఆవిధిఁ బార్టీక్రోధము। బోవిడువక చెప్పినట్టిపూరుషుసాక్ష్యం
బేవిధిగ నమ్మఁజానో। ధీవిలసితులార! చెప్పుఁడు తేటపడంగన్
*ఉ॥ విగ్రహపూజ సేయుమని వేదము వాకొనదంట, యాతఁడ
వ్యగ్రత వేదమంతయును నధ్యయనంబొనరించినట్టి ద
ర్భాగ్రమనీషుఁడౌట నిటు వ్యాఖ్యయొనర్చెడి, నింతపాటి ధీ
రాగ్రణి యున్నవాఁడె భువి నగ్రజులందు నొకండునేనియున్॥ 172
మ॥ ప్రతిమారాధన వేదమొప్పదను నప్రామాణ్యవాగ్వ్రాంత యీ
మతిమంతుండు లిఖించె† వేదములె పోమానంబు లద్దాని, కు
న్నతుఁడౌ పండితు లెందఱో సలిపియున్నా రేతదర్థంబు మేల్
కృతులం గావున వానిఁజూడుము జనంబీయంతయున్ జ్ఞాతమా॥ 173

---

• 13వ సాక్షి యతనితో నేకీభవించినాఁడు కాని తగాదావిషయములలో నంత పార్టీయుద్రేకమును కనఁబఱుపలేదు 14వ సాక్షి యీ (గుంటూరు) తాలూకాలోని గారపాడను గ్రామములో గంగాధరస్వామిగుడిలో నభిషేకములు విశ్వబ్రాహ్మణులు చేయుదురని చెప్పెను. 15వ సాక్షి తాడిపల్లిగ్రామములో విశ్వబ్రాహ్మణులచే బ్రహ్మేశ్వరలింగప్రతిష్ఠ చేయఁబడినట్లు చెప్పెడిని పై యుదాహరణములన్నియు విగ్రహములను బ్రతిష్ఠచేయునపుడు విశ్వబ్రాహ్మణులకుఁగూడ సంబంధమున్నట్లు ఋజువు చేయును

*23 ప్రస్తుతాంశముమీఁద గ్రంథములను విచారించిచూచెద ప్రతిష్ఠను గుఱించి చెప్పునట్టి యాగమములేయనుట నిర్వివాదము వేదములు విగ్రహారాధన నొప్పుకొనవు గనుక వానిలో నాగమములను గుఱించిన ప్రశంసలేదు.

---

† శ్రు॥ తైత్తిరీయకాణ్వసంహితాచతుర్థకాండము
సురూపాం ప్రతిమాం విష్ణోః ప్రసన్నవదనేక్షణాం
తామర్చయేత్తాం ప్రణమేత్తాం యజేత్తాం విచింతయేత్॥

*క॥ వేదమునవిగ్రహార్చన। లేదనునందాక నె యవలీల నెఱిఁగియుం
కేదియుఁ దెలిసికొనుటకును। నాదరముంజూపెనంటయమ్మునిభుఁడా॥
తే॥ అదియెకారణమున నిప్పుడాగమాదు
లందలివిశేషములఁ దనకుం దెలుపఁగ
రాజమన్నారుకవిగారి రాజసభకుఁ
బ్రీతిఁ బిలిపించెనంట పేరేలనుండి॥ 176
క॥ ఈయనపిలిపించునుగా। కాయనయరుదెంచుఁగాక యరుదెంచినపైఁ
జేయఁబడినట్టి కార్యం। బేయదియుంగాన రాదొకించుక యేనిన్॥

---

* కాని యాగమములు నీప్రస్తవిషయముచెప్పు గ్రంథములఁ జదువక నే నింత వఱకు నిరాదరముగాఁ జూచినయంశము నిప్పుడు తెలిసికొనవలెనని బుద్ధి గలిగినందున బ్రాహ్మణుఁడును విశ్వబ్రాహ్మణుఁడునుగాక గొప్పపండితుఁడైన కారెంపూడి రాజమన్నారుగారిని గోర్టులో మధ్యవర్తిగా నేర్పఱచి యాగ్రంథములలోని విశేషముల నాకుఁ దెయఁజెప్పుటకై పేరేలనుండి పిలిపించితిని

---

యజుర్వేదీయ మైత్రాయణసంహితా తృతీయకాండ ప్రథమప్రశ్నము

శ్రు॥ పాషాణ లోహ మణి మృణ్మయ విగ్రహేషు పూజా పునర్భగకరీముముక్షోః

ఋక్సంహితా సప్తమాష్టకము

శ్రు॥ అదో యద్దారుః ప్లవతే సింధోరపారే, అపౌరుషం త దాగభస్వ

రామతాపిన్యుపనిషత్తులోని శివునిగూర్చిన రామవచనము

శ్రు। అవిముక్తే తవ క్షేత్రే సర్వేషాం ముక్తిసిద్ధయే। అహం సన్నిహితస్తత్ర పాషాణప్రతిమాదిషు చిన్మయస్యాద్వితీయస్య నిష్కళస్యాశరీరిణః ఉపాసకానాం కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా

ఋగ్వేదము

శ్రు॥ తవశ్రియే మరుతో మర్జయంత రుద్ర యత్తే జనిమ చారు చిత్రం

వ్యా. హేరుద్ర! తే, మరుతః, బ్రహ్మవిష్ణ్వాదిదేవాః, తవ, చారు, మనోహరం, చిత్రం అద్భుతం, యత్, జనిమ, లింగం, అస్తి, తత్, శ్రియే, ఐశ్వర్యాయ, మర్జయంతః, పూజయంతః, ఆసన్నితి శేషః

షరా— ఇత్యాదులు పెక్కులున్నవి. గ్రంథవిస్తరభీతిచే వదలితి.

ఆ॥ సప్రమాణమైన సాక్ష్య మీయఁగ లేదు
కోర్టువక్తము గని కొంచెమేని
కోర్టువారివలనఁ గొని యధికారంబు
మఱి రిపోర్టు నేని జరుప లేదు। 178

*ఆ॥ అర్చలంగుఱించి యడుగ మున్సిఫుగారు
చెప్పె నెవియొ రెండు చివర కతఁడు
నోటుచేసికొనుచు నుడివినయవ్వాని
తీరుపున లిఖించెఁ గీరుపరియు॥ 179

ఉ॥ పంచప్రశ్నాగమమును। మించెడినట్టియతఁడు చెప్పమేల్విషయంబుల్
మంచిదొ చెడ్డదొ యయ్యది। కాంచుదమన లేదుతత్ప్రకాశమునంగోర్

క॥ కోరుకొనెననియునది మ॥నా॥ రిరుపార్టీలు తద్ఘన గ్రంథము దే

---

*ఆయన పూజనీయములయిన యర్చారూపములు శాక్తములు దైవ్యములు పైశాచములు మానవములునని నాలుగువిధములనియు మనుష్యులకు మానవములతో సంబంధమనియు నవి యభిమానములు సామాన్యములు ప్రకృతములని తిరిగి మూడువిధములుగా విభజింపఁబడెననియు నైశ్వర్యముగలమనుష్యులచే స్థాపింపబడునవియభిమానవిగ్రహములనియు సామాన్యజనులచే స్థాపనచేయింపఁబడునవి సామాన్యవిగ్రహములనియు నపాయపుదినములలో స్థాపనచేయఁబడునవి ప్రకృతవిగ్రహములనియుఁ బ్రకృతములు జనులను రోగములద్వారమున బాధించుచు బలులను గోరునవియగుట నీచదేవతలనఁబడుననియు జెప్పుచుఁ బంచప్రశ్నాగమమను గ్రంథమును గోరుకొనెను గాని యుభయవాదులునుఁ దానిని దేలేకపోయిరి-నిర్ణయసింధువులో బ్రహ్మను బ్రాహ్మణులుమాత్రమే స్థాపనచేయవలెననియు విష్ణువును నాల్గుజాతులవారును మాతృదేవతల నెవరైనను స్థాపనచేయవచ్చుననియుఁ జెప్పఁబడియున్నది -గ్రామదేవతలను దేవతలనితలఁచెడిచో నిర్ణయసింధువులో నెవరయినను స్థాపింపవచ్చునని చెప్పఁబడిన మాతృదేవతలు కావలెను. లేనిచో నవి శాస్త్రములలోనివి కావు కూదుర్గ దర్చకుండుగా నున్నటువంటి విగ్రహముల బ్రాహ్మణుఁడు పూజచేయనే కూడదు చావాగుళ్లలో గొల్ల కుమ్మరు లర్చకులుగా నున్నారు వాదిబ్రాహ్మణుఁడుగనుక యీ దేవతలను బూజచేయుటకు వీలులేదు.

నేరకపోయిరనియునీ। తీరునలిఖియించినాఁడుతీర్పరికనుఁడీ॥

తే॥ గొప్పపండితుఁడనితన్నుఁ గోర్టువారు
మించువేడుకతోఁ బిలిపించినపుడు
గ్రంధసామగ్రితోడనే కదలిరాక
యేలరావలె నూరకే యితఁడు మొదలు॥ 182

కం॥ వచ్చియవాకుచెవాకులు। చెచ్చెరనెవో చెప్పియెందొ చెలగునటన్నన్
దెచ్చెడివారెవరయ్యది। యెచ్చటనేన్ గలదొ లేదొ ఇంతకునదియున్॥

*తే॥ శూద్రుఁ డర్చకుఁడుగనున్నచోట బ్రాహ్మ
ణుఁడు పూజింపఁగూడదం చుండుఁగాక

---

* శైవధర్మము 76వ పుటలో శూద్రుఁడర్చకుఁడుగాఁ గలిగినటువంటి శివుని గాని విష్ణునిగాని పూజచేసినబ్రాహ్మణునికి ముక్తిలేదని చెప్పఁబడియున్నది

(**24**) బ్రాహ్మణు లెప్పుడును భగవంతుని ప్రక్కనుండి భక్తులాభగవంతుని దయకుఁ బాత్రులగులాగు సిఫారసుచేయుటకుఁగల పవిత్రత యెట్టిదైనను గార్గేయాగమములో విగ్రహములు చేయుట మొదలుకొని గుళ్ళలోస్థాపనచేయునంతవఱకు కడుపులోఁ బిండమెన్ని విధములుగా మాఱునో యన్నిదశ లీవిగ్రహముకూడ ననుభవింపవలసియుండునని చెప్పఁబడినందునఁ బ్రతిష్ఠప్పుడు మాన్యస్థానార్హుఁడు శిల్పాచార్యుఁడని చెప్పఁబడినట్లును నెపుడును విడనాడకుండ నుండవలసివచ్చి యతఁడులేకుండ గడపుకొనుటకు వీలులేనట్లును గనఁబడెడిని ప్రతివాదుల సాక్ష్యములోఁ జెప్పఁబడిన ప్రతిష్ఠలుచేయఁబడినవోట్లు ప్రతిష్ఠాసంబంధములోఁ బ్రతివాదులకుఁగల యధికారమును స్థిరపఱచును ఎల్లవిగ్రహములను స్థాపనచేయుటకు హక్కు కలిగినవారు శిల్పాచార్యులేనాయను విషయమును గుఱించి నాయొక్క నిశ్చయాభిప్రాయము నీయనక్కఱలేదు. ప్రతివాదులు తాముగూడ శిల్పాచార్యుల తెగలోనివారమని చెప్పుకొనుట కేమియు నభ్యంతరమున్నట్లు కనఁబడదు ఈదావాలో బ్రాహ్మణులవిషయమై శావలసియున్నది వాది బ్రాహ్మణుఁడనని వాదించుచున్నాఁడు నిర్ణయసింధువులో శూద్రుఁడర్చకుఁడుగాఁ గలిగినటువంటి విగ్రహములను బ్రాహ్మణులు పూజించిన నరకమును బొందుదురని చెప్పఁబడియున్నది వారి యటువంటి నరకమును గోరుకొనకపోవచ్చును సాక్ష్యమునుబట్టి తెలియుచున్న సామాన్యముగ జరుగు క్షుద్రదేవతలఁబూజచేయుట వానికి జంతువుల బలియిచ్చుట బ్రాహ్మణులయొక్క యనిష్టమును ఋజువు చేయుచున్నవి

అద్రి శివ కేశవులవిషయంబె కాని
గ్రామదేవతవిషయమై కాదుకాదు॥ 184

ప్రస్తుతపుదేవతలు శివుఁడు గాని విష్ణువుగాని యయిన నాయుద్దేశ మేలాగున్నప్పటికిఁ బోలేరమ్మ పాతపాటమ్మ మొదలగు గ్రామదేవతల ప్రతిష్ఠ వాదియు వాదికులమువారును మాత్రమే చేయవలెనని లేదని నేను జెప్పవచ్చును-కనుక మొదటిసారాంశము వాది కననుకూలముగాఁ దేలినది

(25) 2 వసారాంశము-మొదటిసారాంశపువాదములో వాదుకనుబట్టియు గార్గేయాగమమునుబట్టియుఁ బ్రతివాదికులమువారికిఁ బ్రతిష్ఠాసమయములో నెక్కువ ముఖ్యమైన భాగముండుటనుబట్టియుఁ బ్రకృతదేవతలుగాక యింకొక యెక్కువదేవుఁడయినప్పటికి మైలపడనేరఁడు కనుక యీ దావా దేవతలవిషయమై చెప్పనవసరములేదు-అవి మయిలపడనేలేదు-రెండవసారాంశముకూడ వాదికననుకూలముగానే తీర్మానించితిని

(26) మూఁడవసారాంశము వాది నష్ట మెట్లుడుగుచున్నాఁడో నాకుఁ దెలియదు. గ్రామదేవతలను బూజచేయుట కర్తలయున్నదని యనుకొనినప్పటికి సహస్రసంఖ్యాకజనులలోవాదియు నొకఁడు దావా బ్రాహ్మణసంఘముపక్షమునఁ దిసికొనివచ్చినవాఁడు కాఁడు సంఘముపక్షమునఁ దిసికొని వచ్చి తరువాత దా నొక్కఁడే దావా నడపినాఁడు ద్విజసంఘము తెరఫున దావానడపుట కుత్తరువిచ్చినట్లుంచినప్పటికి లెక్కకెక్కువయిన ముఖ్యసంఘమును వదలిపెట్టినాఁడు పూజచేయువారిలో నధికసంఖ్యాకులు శూద్రజాతిలోనుండిరి వారిపక్షమునఁగూడ నేజంటుగానుండుట కేర్పాటుచుకోలేదు ఆప్రతిష్ఠకు వారు తృప్తిఁ జెందియుండిరి. ఇప్పటికయినను దమ్మ నెమ్మదిగానుంచి నవో నసేకవందనము లొనరింతురు ఎవరివల్లను నధికారముఁ బొందిన యేజంటుకాఁడుగనుక హైందవసంఘమునకుఁగా వాయన కేమియు నష్టముకట్టియిచ్చుటకు వీలులేదు-అయన యింకొకప్రతిష్ఠచేయఁబూనుకొనుట కేమియు విధిలేదు-తానాపూజలలో సంబంధముగలిగించుకొనుటకు వీలులేదుగనుక తినకుఁగలిగిన పారమార్థికనష్టమునకుఁగాను బ్రతిఫలము కోరవలసియుండెఁగాఁ దిరిగి పున్రతిష్ఠచేయుటకుఁ గావలసినద్రవ్యమిప్పించుమని కోరినాఁడు-పారమార్థికనష్టమునుగోరినను దానికి సమానముగాఁ జెప్పఁదగిన ప్రాపంచికవస్తువు లేమియు నుండనేరవుగనుక పారమార్థికనష్టము ద్రవ్యరూపముగా నిర్ధారణచేయుటకు వీలులేదు.

*చం॥ శిలలు పురాతనంబులయి చేడ్పడియుండఁగ నూత్నవిగ్రహాల్
నిలిపితిమంచు నాన్నరున నిక్కము వారలె తెల్పియుండఁగన్
దొలిప్రతివాది కొక్కనికె తోరపుజోక్యముగాను తక్కినా
రలకుఁ బ్రతిష్ఠ లేదనుచు వ్రాసిన మున్సిఫుగారి నెన్న నౌ॥ 185

†క॥ మతవిద్వేషముఁ బెంచెడి
మతితో నే నుంటినని మాట యనృతమౌ
ఇతరులవాంఛిత లనృతమని
మతిఁదోఁచినఁ బ్రతిలిఖించుమాట నిజముగా॥ 186

---

కాబట్టి నష్టమును గుఱించినదావాకూడ నిల్వఁదగినదికాదు విశ్వబ్రాహ్మణుల సంబంధముపుచ్చుకొనుటవలన దేవతాశిల లపరిశుద్ధములైనవని కాని మఱుం దపరిశుద్ధము లగునని కాని ఋజువుకాలేదుగనుక యింజక్షనుగూడ నిప్పించుటకు వీలులేదు. ఈసారాంశముకూడ వాదికి విరుద్ధముగాఁ దీర్మానించితిని

(27) ఈదావాయందికొక విచిత్రమున్నది 1వ ప్రతివాది యీప్రతిష్ఠచేయుటకుఁ బిలువఁబడిన యన్యగ్రామవాసి గారిమస్థులు సొమ్మునిచ్చి యేర్పఱచుకొన్న యేజంటు వాది ప్రత్యేక మాయనమీఁద వ్యాజ్యము దెచ్చుటకుఁ గారణములేదు ఏమేనియున్నను నాయన చచ్చినందువలన సంక్షేపించుకొనగలసియుండెను గాని తరువాతఁగూడ వాజ్యమును నడపఁగూడదు

* 2 మొదలు 5 వఱకైన ప్రతివాదులకీప్రతిష్ఠతో నేమియు సంబంధము కలిగియున్నట్లు తోఁపదు వారు ప్రతివాది సంఘమునకుఁ జేరియుండుటయేతప్ప నితరకారణ మేమియు లేదు. వారిలో నెవరైన నక్కడ నుండినారనుటకుఁగూడసందేహమే. కొంతమంది యక్కడ లేమనికూడఁ జెప్పుచున్నారు వారిమీఁద వ్యాజ్యమునకుఁ గారణము లేనట్లు తీర్మానించుచున్నాను వాది కీవ్యాజ్యము జరిగింపవలెనని యభిప్రాయమున్నదిగనుక యిందు ముఖ్యముగాఁ బ్రతివాదులుగాఁ జేర్పఁదగినవారు దీనికిఁ జందావేసి ప్రతిష్ఠ యేర్పాటుచేసిన తత్ గ్రామపువారయియున్నారు

† ఆయన నిశ్చయముగాఁ బాలశాలలనుంచి యుభయపాదులయొక్క మనస్సులను కలంచెడి బ్రాహ్మణులెక్కువ విశ్వబ్రాహ్మణులెక్కువ యనెడి వాదము ద్వారముననైన గోపమును బుట్టించువిషయమై పోరాడవలెనను నుద్దేశముతో నున్నవాఁడు.

ఉ॥ అంతం గోయిలగుంపు పాడుటకు నేర్పందంగ రాచిల్కబా
రెంతో ఘుబ్రపుఁ బల్కులన్నె అపఁ జె ప్పెర్పా నిగుళ్లొందికన్
వింతన్నింపఁగఁ బోతుపెంటికవ లోలిన్ మర్లచేఁ గ్రుమ్మరన్
బొంత న్నామనినూపెఁ దీవెలను సొంపుల్ గ్రాలు కేళ్యానుచున్॥
ఉ॥ ఆమనివచ్చెనింకఁ గలియంగను సాదియటంచు మర్లచే
నేమియొఱుంగనట్టి కవలెల్లను గుంపుగనాలకించున
ట్లా మరునానతిన్ మిగుల నబ్రముగాఁగను జాటఁజొచ్చెనా
గోమగు కోయిలల్ గొదలఁ గోయనిచేసె నిగుళ్ళమెక్కుచున్॥
మ॥ మరుకై వారములెల్లెడన్ సలుపుఁడిమ్మాడ్కిన్ మిముల్ నోము రా
కురు కోర్కెల్ వెలయింపుఁ గాఁగిళల మాకొమ్మల్ సుమాళింప నీ
తటివోవన్ బెడబాటులబ్బునను వింతం దెల్పునో నా విన
బరువై తేనియలొల్కఁ గూయుఁ జిలుకల్ బొర్బార్లుగా నామనిన్॥
చం॥ చలివడి వెన్కఁబట్టెఁ జొరసాగెను వేఁడిమి పొంచి యామనిన్
నిలుకడమానె రేలునికి నెక్కొని నిక్కెఁ బగళ్ళు రాలఁగా
నెలకొనెఁ బండుటాకులొగి నిబ్బరపాటు చివుళ్లుదాల్చె ని
ట్టులెకద యొక్కఁ డెత్తువడఁ డోకున నింకొకఁ డేపుఁజెందెడిన్॥
ఉ॥ పొంగినబావులన్ మొయిలుపూవు పదంపడి యింకిపోవ ద
ప్పింగొని రేఁబవల్ దిరుగు పేరడవింగల కార్మొకాలు ద్రా
వం గనుపట్టెఁ బెక్కులుగ వట్టి దగాలగు నెండమావులే
దొంగ పయిండి మేఁమిగఁ దొట్రిలఁజేసెనరీతి నత్తఱిన్॥ 199
సీ॥ గందపుంబూఁత లగ్గలికంబులైమించె
పీవనల్ పట్టులవిడువవయ్యె
చల్వపందిరు లెల్లచాయల మెండయ్యె
క్రొత్తముస్తాబులఁ గొమ్మలలరె
తీయనిపానకాల్ తెమ్మని యెద లార్చె
మొదటిపంటలచప్పుల్ మురువులయ్యె

మరుని నెచ్చెలి మ్రొక్కు లురవయ్యెనంతట
గ్రుడ్డుచూలులరొదల్ గొనబులయ్యె
మరులు దఱచయ్యె వేడ్క ద్రిమ్మరులకెల్ల
తెమ్మెరలు వీచె నుసుఱులు తెమ్మెరనియె
తమ్ము లలరారె మరుని క్రొత్తమ్ములనఁగ
ఆమనిఁ బజొప్పుతఱిని గన్నామనఁగను॥ 200

ఉ॥ తీవెలకేలులం బెనఁగి తీయనిపూఁజొన మోవిపానకం
శావలనిచ్చి పూమొగడలన్ చనుదోయిని బట్టనొప్పి క్రొ
మ్మావిచిగుళ్ల సెజ్జనిడి మాటికి నత్తఱిఁ బండుటాకు లం
గా వదలించి వేడ్క మరునంటుని నామనిలచ్చి కూడెదున్॥ 201

కం॥ అడవిసిరిచేడెఁ గూడఁగ
గడఁగి చిలుకరౌతు నేస్తి కఱిదేవర య
య్యెడఁ గాన్కనిడిన కెంపుల
తొడవులునా నామనిఁ దగెఁ దొలికెంజిగురుల్॥ 202

ఉ॥ సన్ననివల్వలుఁ బులుపుజొలును జల్లనిపండ్లతిండ్లు పూ
వన్నెలపాన్పు లన్నువలపాటలు వెన్నెలయాట లెప్డుఁ బై
టన్నిదురించుకోర్కెలు మిఁగారులకౌఁగిళు లెల్లచోఁ బజన్
వెన్నడఁజొచ్చె నింపులయి వేమఱు నామనివచ్చు నంతలోన్॥ 203

సీ॥ వేగుపోకనె యేటికేగి మున్కలనిడె
డి ముసలిగమిపాలిటి చలిమంట
కప్పు దుప్పట్లు లేకను జలిఁ గాసిల్లు
పేదలపాలింటి పెద్దసాలు
వేఁకిచే నఱుకుచే వేగువారల మన్ప
వేల్పువెజ్జలు నింపు వేడిమందు
అన్నింటి వడఁకించి యడలుచే నొప్పించి
వేపించుచలిపాలి వేగుఁజుక్క

నేలమూల్లి గురుదాల్పఁ బెన్నిటివసతి
బాజుగుగజిబిజిగములకుఁబుట్టినిల్లు
చలావపన్నిరుదాల్ప నచ్చుంపుకారు
ఆమని చెలంగె నుసుఱబారామువాల్ప॥ 204

తే॥ పూఁదటి యుసుర్ల కెంతో యింపుదియె రైన
జాజులకు దెరువర్లకుఁ దేజుదోఱఁగె
వెన్నెల యదెంత యింపుగా వెలయుచున్న
తమ్ములకుఁ జక్కవేఁకు వంతనిడుఁగాదె 205

తే॥ వెలయున య్యామనితఱిని వెన్నుఁడు నెల
పేరితేఁ డొక్కజన్నంబుఁ బేర్మిఁజేసి
నేలవేల్పుల రతనాల నాలఁ జాల
తనిపి పేరీవిఁ బేరెక్కి తనరుచుండె॥ 206

తే॥ అట్టితఱి మంచిదని తన యూది నెంచి
టక్కులకుఁ బట్టుగొమ్మైన రవళికాఁడు
గాధికొమరుండు నెత్తొండు గడఁగియొకట
ఎడముగా నేగి తలపోయఁదొడఁగె నిట్లు॥ 207

క॥ తలఁచినకర్జము నెగ్గెడి
వలనిది, యిపు డేను జేనివద్దకుఁజని పొ
త్తులరించి దీవనలనిడి
బలుజన్నముఁ జేయు నెపముఁ బైనిడిలిబ్బిఁ॥ 208

తే॥ మిక్కుటంబుగ వేడి యమ్మేటిఁ జలము
నూని వేగించి పైకంబు లేనియదను
నెఱిఁగి పెడకంతఁ బెట్టి బొంకింతుననుచు
నెమ్మదిని దిట్టతనమును నెగడఁజేసి॥ 209

క॥ విడిముడిమిక్కిలియూరెడి
మఱుఁగు గెలువరాని ప్రోలు మంతు హరిశ్చం

క్రుఁడునా రాయని పీటికి
జడదారులమిన్న యేగి చయ్యన డాసెన్ 210
ఆ॥ డాసి రాచనగరు దగ్గఱి పెన్రచ్చ
నడరు చంద్రమతియు నెడుపొలంతి
వారను గనుడు నతఁ డెదుర్కొని కేల్మోడ్చి
యడలుబత్తి నిగుడ నడుగులొత్తి॥ 211
క॥ అనువగుపింగపుగద్దియ
నునిచి యతని యడుగుదోయి నొగివ్రాలియు బల్
కనికరమున నతఁడిడు దీ
వనలఁ దనివినొంది యిట్లుపలికెఁ గులుకుతోన్॥ 212
మ॥ కొలచాల్కనల కాఱుచిచ్చు నినునేఁ గొండాడఁగా నేర్తునే
నలువన్ దూఱిన తేజుచే నుసుఱుల న్గల్గించి మార్బమ్మనై
వెలుగొందీ విటరాఁగ నాయునికి యొప్పైన్ మిన్నయై పండెఁ గో
ర్కులు నాయిల్ మడిదాల్చె వల్గురను బేరుం బొందితిన్ నేఁటితోన్
క॥ నేఁజేయు జన్న మిపుడుక
దా జగముకనసమునొందెఁ దబిసిపుఁ! నీ
యీఁజిగి యిటఁగ్రాలుట ము
న్నె జన్నియఁ జేసితినొక యీవిటురాఁగన్॥ 214
క॥ అనవుడు రాయనిఁ గని జో
గి నుడివె "మైదాల్పు వేల్పుగిడ్డివి నిన్నున్
జను నే యొరునకుఁబోల్పఁగ
విను మల్లియ నుల్లిఁబోల్పు వేదురుగలఁడే॥ 215
తే॥ వేల్పుమ్రానును నొక కట్టె వేడినట్లు
హైఁడిమలపొన్న చిన్నమీఁబలికినట్లు
పుడుకుపసి నొకగుమ్మ పాలడిగినట్లు
చిన్నయీవిని నిన్ గోరఁ జేరినాఁడ॥ 216

ఉ॥ లేనెలదాల్పు వేడ్కకయి లెస్సగ జన్న మొకండుసేయఁగాఁ
బూనితి, దానికై పయికముల్ నినుఁ గోరఁగనుంటి నెంతనన్
ఏనుఁగుపైకినెక్కి యొకఁ డెంతయు నిక్కుచు గోట మీానికం
బానిక మీాట నేడ నది యాఁగునొ యంతగ రాసిగావలెన్"॥ 217

చ॥ అనవుడు వేఁడు 'మీారడిగినంతయు లిచ్చి గొనుం డొసంగెదన్
దనివిని, నాదుపు ట్టగును నాడెము మీాకిడ"నాపు డేలికన్
గని"బలె! యెంతవాఁ డితని గాటపుటీవికి మెచ్చవచ్చు మే"
లని తలయూఁచి యెద్ది విస మంగుట బెల్లమువెట్టి వింతగాన్॥ 218

శా॥ నీస త్రెట్టిదా మెంచఁగోరి యిటులట్టింగాని నిన్ బోలు మా
యాసల్ గూర్చెడి యీా(గికాంద్రలర)నేలామాకు రొక్కంబు లె
స్సో సుం తక్కఱగల్గ వత్తునిది యప్పంబోలె నియింటనే
వీసంబైనను జిందుసేయకయ నీవే దాచి యుంచన్ వలెన్॥ 219

క॥ అక్కఱగల్గుడుఁ జెప్పెదఁ। దక్కిడిచే నీయవేని తప్పునుమీాయా
ముక్కంటి యానమేలగు। నిక్కడనుండంగఁజెల్లదే"నని యేగెన్॥

క॥ చనుటయు నెడయం 'డద్దిర
నను రొక్కమువేడి యేమొ నావద్దనె య
ప్పనియునిచి చనియె నిప్పుడ
గొన మేలా లేనితఱిని గోరునొ యేమో॥ 221

తే॥ తగనిరోసంబుఁ జలమును దాల్చినట్టి
అంతుతుదియగ్గి యీాతఁడే యలిగెనేని
జగము లీరేడు చిటికలో సమసిపోవు
ముగురువేల్పు లితని మ్రోల బొమ్మలుకడ"॥ 222

జ॥ అని నెమ్మదిఁ దలపోయుచుఁ
దనకున్ ముందెట్టికీడు దలపడకుండన్
మినుసిక దేవర నెన్నుచు
వనట నొడయఁ డేలుబడి నెపంబున మఱచెన్॥ 223

తే॥ అంత నక్కడఁ డాటోటుహొంతకాఁడు
గాధికొమరుండు తనలోనఁ గడఁగి కడఁగి
మోస మొక్కఁడు సేయంగ మోము నింగి
కెత్తి తలపోసె చయ్యన నిచ్చగించి 224

క॥ క్రొత్తవి క్రొవ్విన వింపువి
యొత్తుడుఁ జేయునవి బీతునొందించెడివిన్
సత్తుగలపి యగు టక్కిరి
జిత్తు మెకపుగమిని బుట్టజేసెం గడిమిన్॥ 225

మ॥ ఇటుపుట్టించిన గబ్బికొడుమెకముల్ హెచ్చిల్లి యొక్కుమ్మడిన్
కటువుల్ నల్దెసలందుఁ జొన్పి తెగసాగం జొచ్చి మేల్ పంటలన్ —
దిటవూ పెంపుడుచెట్లఁ దోపులను మ్రందించంగఁ జొచ్చెం దమం
తట రేయుంబవ లొక్కమాద్రి బువినంతన్ హాయుగాఁబాఱుచున్

సీ॥ వరిచేలఁబడి పొట్ట లురవుగా రామేసి
కాఱెనుపోతు లొక్కవసిఁదిరుగు
మందలఁబడి యూల మడఁచి కాంద్రుమటంచు
గడిపులు లూళ్ళ సికార్లుచేయు
కొమ్మలఁ దొండాలఁ గూల్చి బార్లుగ మత్తు
టేన్గు లంతటఁ గేక నేగుచుండు
కసవుదుంపలమెక్కి కసినిక్కబసిబీళ్ళ
దున్ని యొక్కెడఁ బందిగున్నలరుగు
అడుగువాల్పిట్టల నడంచి యరుగునక్క
లెల్లెడలనంటి తోఁటలనేర్చు దుప్పు
లిటుల దొరయూ హరిశ్చంద్రు నేలుబడిని
జెలఁగి మ్రుక్కిడిమెకములు బలసి కలఁచె॥ 227

క॥ అమ్మెకముల బాములకో।క్కుమ్మడిఁబజ లెల్ల మొఱ్ఱోకు రొయ్యాయనినై
శమ్మహరిశ్చంద్రుఁడను। నమ్మానిసిసామిఁ జేరియనఁదొడఁగిరిటుల్॥

ఉ॥ "ఓదొర! నీదు నేలుబడి నుంటిమి నెమ్మదిఁ గూడుగుడ్డయున్
లేదన కేడ సంతసములే గలుగన్, గడిముచ్చు లెవ్వొకాం
డ్రే దెస మందుకైనఁ గనుపించరు, వెట్టులు కుంట్లు గ్రుడ్డులున్
వేదురు లెప్పులేరు, సిరి వేలును లచ్చలు నుండు నెల్లెడన్॥ 229
ఉ॥ పంటయుఁ బాడి మెండు, కఱవా యెటువంటిదొ మేమెఱుంగ,మ
న్నింటికి లోటు లేదు, తగ వెన్నడుఁ గానము, జూదరుల్ పగల్
కొంటెలు లేరు క్షేమములు కొల్లలు, పండువు లన్ని వేళలన్
అంటులు లేవు కల్కెమునకైనను, జేడియలెల్లఁ గ్రొత్తదుల్॥ 230
కం॥ చెలికాండ్రు నన్నదమ్ములుఁ
బొలఁతులు బిడ్డలును జెలులు మొదలగు సిరి సి
చ్చలు నెండకన్నెఱుంగక
బలుకూరిమినుంటి మింతవఱ కొడయండా! 231
ఉ॥ ఇట్టులనుండ నేఁటి కిదియేమొకొ కొడుమెకాలప్రాప్తి లె
ప్పట్టుస లెక్కలేక కనుపట్టుచు తుమ్ములఁ బెట్టుచున్నయి
క్కట్టులఁ జెప్పలే,మదియుఁగాకయుఁ దోఁటలఁ బైరులం గటా!
పెట్టిరొ లేదొ నాఁగ బమ పెట్టఁగఁ జేసెను నేలమట్టమున్॥
సీ॥ మా యాలమంద లేచాయనో చెప్పఁగా
లే మెమ్మొగుర్తులు లేకయున్న
మా యనంటులతోఁట లేమెడనున్నవొ
చెప్పఁజాలము దోప్ప చెలకగనక
పెట్టుబళ్లెన్నైనఁ బెట్టితిమయ్యా పై
ర్లింకఁ గోయుట కెట నేమిలేవు
రేటు హెచ్చునకొప్పి నాటించితిమిదొడ్ల
పాదుల యానవాల్పట్ట లేము
పెంచుకోళులు నెమళులఁ బీచమణఁచె
మెట్టపంటల నన్నింటి మట్టిఁగలిపె

అంటుమామిడితోఁటలు మంటఁగలిసె
పసులు మేసెడిబీళ్లు నిప్పచ్చరంబె॥ 233

సీ॥ బోరెండుసెలవయ్యెఁ బూఁదోఁటలకుమాకు
మొక్క యొక్కటి లేదు,నిక్కమయ్య
కొబ్బరితోఁట లెక్కుడుగాసెనిస్సాలు
నను గాని యొక కాయ తినఁగ లేదు
బొండుకాకు లవేడనుండివచ్చెనో బక్క
పసులపాలిఁటి జముబంటులయ్యొ
మాయూర బడిపిల్లకాయల మడియించెఁ
బులులచేరాట మబ్బురము సామి
చెఱకుదోఁటలఁ దోఁడేండ్లు చెఱచివైచె
కొమ్ముపందులు పల్లెల దుమ్ముసేసె
ఇండ్ల పైకప్పులను గోఁతు లెగురఁజిమ్మె
ఇట్టికడగండ్లఁబడి యోర్చు టెట్టులయ్య
తే॥ కాఁపురము సేయలే మొక్కగడియయైన
మెకములనుజంపి మముఁబ్రోవ మెలఁగవేని
కొటికలనుబాసి పల్నాళ్ళఁగూర్చిపోఁగ
వలయు మాయందు నెనరుంచవయ్య సామి!”॥ 235

చ॥ అని పజ విన్నవింప నెద నక్కటికంబొదవంగ రాయఁడి
ట్లను “వెఱఁగందనేల, చనుఁ డందఱుఁ జెడ్డమెకాలబారి యిం
కెనయదుమిమ్ము, పేరెదల (నెంతయుఁ) గెలులనింపిపండుఁ, డేఁ
జనియెద వేఁట(లాడుచు)వెసన్ మిము నేర్చుమెకాలఁ దున్మఁగన్”
తే॥ అనుచుఁ బజనెల్ల నూరార్చి యనిపె, నంత
నాఱురెండొడళుల్ గలయట్టిమేటి
కత్తివేలుపువలకన్ను కడలివెన్న
జంట యెజ్జనివేలుపుసామి ప్రొద్దు॥

నిఘంటువులెల్ల నీవిధముగానే చెప్పినవి. ఇన్ని యిట్లు చెప్పుచుండినను బూర్వము మన దయానందసరస్వతీస్వామి వారును నిపుడు వారిశిష్యాగ్రేసరచక్రవర్తి-శిరోమణిభట్టాచార్యులగు నార్యనారాయణమూర్తిగారును నాశాస్త్రఘోషనంతను బెడచెవినినిడి తమపట్టువీడక గుణకర్మస్వభావమునుబట్టియే జాతివ్యవస్థగావింపవలెనని వాదింపుచున్నారు. ఈవాదమునుజూచిన వివేకిలోకమునకు వింతయును విషాదమును గలుగకపోవు. వీరివలెనే మఱికొందఱుసోదరులు "జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతేద్విజః, వేదపారేనవిప్రస్తు బ్రహ్మజ్ఞానేనబ్రాహ్మణః" అనుశ్లోకమునుజదివి యిపుడు బ్రాహ్మణులని వ్యవహరింపఁబడువారు నిజముగా బ్రాహ్మణులుగారనియు, బ్రహ్మజ్ఞానముగల వారే బ్రాహ్మణులనియుఁ జెప్పుటయు వ్రాయుటయు వాడుకయై యున్నది. ఇదియుఁ బైవారివాదమువలెనే విమర్శనార్హమైయుండుటచేఁ బనిలోఁబనిగా దానినిగూడ నించుక చర్చింపఁదలఁచితిమి. పైశ్లోకము వ్రాయునపుడుకాని చదువునపుడుకాని దానిని బ్రమాణముగాగ్రహియించువారు తమ యేగ్రంథమునుండి యీశ్లోకమును గ్రహించుచుండిరో తెలుపుటలేదు. దీనింబట్టి యిది ధర్మశాస్త్రవచనమే కాదని తోఁచుచున్నది. అయినను బలువురు వాడుచుండుటచే మనమును బ్రమాణవచనమైనట్లెంచుకొని యించుక విమర్శించుకొందము. దీనిని సాధారణముగా బ్రాహ్మణులయెడ జాతిద్వేషముగల బ్రాహ్మణేతరులు మాత్రమే యుపయోగించుచున్నవారు. దీనివలనదమకేమి యుపయోగము గలుగునని గ్రహించుచున్నారో తెలియదు. దీనిని బాగుగఁ దఱచిచూచిన బ్రాహ్మణజాతికిమాత్రమే యుపయోగింపఁదగినదిగా నున్నది. "జన్మనాజాయతేశూద్రః,=జన్మచేత శూద్రుఁడై పుట్టుచున్నాఁడు. "కర్మణాజాయతే ద్విజః=కర్మము (ఉపనయనసంస్కారము) చేత రెండవజన్మగలవాఁడై పుట్టుచున్నవాఁడు. "వేదపారేన విప్రస్తు=వేదమునుజదువుటచేత విప్రుఁడగుచున్నాఁడు, బ్రహ్మజ్ఞానేనబ్రాహ్మ

కాశీ,=బ్రహ్మజ్ఞానముచేత .బ్రాహ్మణుఁడగుచున్నాఁడు, అని వారు పైశ్లో
కమున కర్థము చెప్పుచున్నారు. ఇందు జన్మచేతఁ బ్రతివాఁడును
శూద్రుఁ డగుచున్నాఁడనియుఁ గర్మచేత వారందఱు ద్విజులగు
చున్నారనియు నుండుటచే జాతి సంస్కారముచేతవచ్చునదియని-వారు
భ్రమించుచున్నవారు. ఉపనయన సంస్కారముచేత జన్మచే శూద్రుఁ
డగువాఁడు ద్విజుఁడగునేని శాస్త్రములందు మూఁడుజాతులుమాత్రమే
చెప్పఁబడవలెను. అట్లు లేదు. నాలవదియగు శూద్రజాతి ప్రత్యేకము
గానున్నట్లు వర్ణింపఁబడియున్నది. ఇప్పటివఱ కాచారము ప్రత్యక్ష
మైయున్నది. ఇట్లుండఁగా జన్మముతోఁ రావలసినవర్ణము కర్మనుబట్టివ
చ్చుననుట శాస్త్రానుభవవిరుద్ధమనుట కావంతయు సందియము లేదు.
కొంచెముకాలము వారివాద మంగీకరించిచూచిన నాశ్లోకములోని
మొదటి రెండుపాదములు నాలవదియగు శూద్రజాతిని దుడిచిపెట్టి
మిగిలిన మూఁడుజాతులను నిలిపియుండఁగాఁ దక్కిన రెండుపాదములు
బ్రహ్మక్షత్రియవైశ్యులలో క్షత్రియవైశ్యజాతుల రెంటిని నడుగంటించి
యొక్క బ్రాహ్మణజాతిమాత్రమే నిల్పుచున్నవి. దీనివలననవా రేకజాతి
కావలయునని కోరుచున్నట్లు ధ్రువపడుచున్నది. ఎట్లర్థము చెప్పిననేమి
వీరికోరికగూడ వర్ణసాంకర్యకరణమునకుఁ గంకణముగట్టుకొనియున్న
సంఘసంస్కారుల ప్రయత్నమునకై తోడుపడుచున్నది. కావునఁ బైశ్లో
కమునకు మనసోదరులుసల్పినయర్థము మేము వెనుకఁదెలిపిన శ్రుతి
స్మృతి సూత్ర పురాణేతిహాసజ్యోతిశ్శాస్త్ర సుశ్రుత నిఘంటువచనము
లకు నెల్లఁ బరమవిరోధగానున్నది. ఇంతియగాక వీరియర్థము
వ్యాకరణశాస్త్రము
( గావించిన యర్థమునకు విరుద్ధముగానున్నది. చూడుఁడు, సిద్ధాం
తకౌముదిని నపత్యాధికారమునందు (6-4-171) బ్రాహ్మోఽజాతౌ
అనుపాణిని సూత్రమునకు భట్టోజిదీక్షితు లిట్లువృత్తిని జేసియున్నవారు.
" యోగవిభాగోత్రకర్తవ్యః బ్రాహ్మఇతి నిపాత్యతే అనపత్యేఽణి-

నిఘంటువులెల్ల నీవిధముగానే చెప్పినవి. ఇన్ని యిట్లు చెప్పుచుండినను బూర్వము మన దయానందసరస్వతీస్వామివారును నిపుడు వారిశిష్యాగ్రేసరచక్రవర్తి-శిరోమణిభట్టాచార్యులగు నార్యనారాయణమూర్తిగారును నాశాస్త్రఘోషనంతను బెడచెవినినిడి తమపట్టువీడక గుణకర్మస్వభావమునుబట్టియే జాతివ్యవస్థగావింపవలెనని వాదింపుచున్నారు. ఈవాదమునుజూచిన వివేకిలోకమునకు వింతయును విషాదమును గలుగకపోవు. వీరివలెనే మఱికొందఱుసోదరులు "జన్మనాజాయతే శూద్రః కర్మణాజాయతేద్విజః, వేదపాఠేనవిప్రస్తు బ్రహ్మజ్ఞానేనబ్రాహ్మణః" అనుశ్లోకమునుజదివి యిపుడు బ్రాహ్మణులని వ్యవహరింపఁబడువారు నిజముగా బ్రాహ్మణులుగారనియు, బ్రహ్మజ్ఞానముగల వారే బ్రాహ్మణులనియుఁ జెప్పుటయు వ్రాయుటయు వాడుకయై యున్నది. ఇదియుఁ బైవారివాదమువలెనే విమర్శనార్హమైయుండుటచేఁ బనిలోఁబనిగా దానినిగూడ నించుక చర్చింపఁదలఁచితిమి. పైశ్లోకము వ్రాయునపుడుకాని చదువునపుడుకాని దానిని బ్రమాణముగాగ్రహియించువారు తమ రేగ్రంథమునుండి యీశ్లోకమును గ్రహించుచుండిరో తెలుపుటలేదు. దీనింబట్టి యిది ధర్మశాస్త్రవచనమే కాదని తోఁచుచున్నది. అయినను బలువురు వాడుచుండుటచేఁ మనమును బ్రమాణవచనమైనట్లెంచుకొని యించుక విమర్శించుకొందము. దీనిని సాధారణముగా బ్రాహ్మణులయెడ జాతిద్వేషముగల బ్రాహ్మణేతరులు మాత్రమే యుపయోగించుచున్నవారు. దీనివలన దమకేమి యుపయోగము గలుగునని గ్రహించుచున్నారో తెలియదు. దీనిని బాగుగఁ దఱచిచూచిన బ్రాహ్మణజాతికిమాత్రమే యుపయోగింపఁదగినదిగా నున్నది. "జన్మనాజాయతేశూద్రః,=జన్మచేత శూద్రుఁడై పుట్టుచున్నాఁడు. "కర్మణాజాయతే ద్విజః=కర్మము (ఉపనయనసంస్కారము) చేత రెండవజన్మగలవాఁడై పుట్టుచున్నవాఁడు. "వేదపాఠేన విప్రస్తు= వేదమునుజదువుటచేత విప్రుఁడగుచున్నాఁడు, బ్రహ్మజ్ఞానేనబ్రాహ్మ

కాః,=బ్రహ్మజ్ఞానముచేత ,బ్రాహ్మణుఁడగుచున్నాఁడు, అని వారు పైశ్లోకమున కర్థము చెప్పుచున్నారు. ఇందు జన్మచేతఁ బ్రతివాఁడును శూద్రుఁ డగుచున్నాఁడనియుఁ గర్మచేత వారందఱు ద్విజులగుచున్నారనియు నుండుటచే జాతి సంస్కారముచేతవచ్చునదియని వారు భ్రమించుచున్నవారు. ఉపనయన సంస్కారముచేత జన్మచే శూద్రుఁడగువాఁడు ద్విజుఁడగునేని శాస్త్రములందు మూఁడుజాతులుమాత్రమే చెప్పఁబడవలెను. అట్లులేదు. నాలవదియగు శూద్రజాతి ప్రత్యేకముగానున్నట్లు వర్ణింపఁబడియున్నది. ఇప్పటివఱకు నాచారము ప్రత్యక్షమైయున్నది ఇట్లుండఁగా జన్మముతోఁ రావలసినవర్ణము కర్మనుబట్టివచ్చుననుట శాస్త్రానుభవవిరుద్ధమనుట కావంతయు సందియము లేదు. కొంచెముకాలము వారివాద మంగీకరించిచూచిన నాశ్లోకములోని మొదటి రెండుపాదములు నాలవదియగు శూద్రజాతిని దుడిచిపెట్టి మిగిలిన మూఁడుజాతులను నిలిపియుండఁగాఁ దక్కిన రెండుపాదములు బ్రహ్మక్షత్రియవైశ్యులలో క్షత్రియవైశ్యజాతుల రెంటిని నడుగంటించి యొక్క బ్రాహ్మణజాతిమాత్రమేనిల్పుచున్నవి. దీనివలనవా రేకజాతి కావలయునని కోరుచున్నట్లు ధ్రువపడుచున్నది. ఎట్లర్థము చెప్పిననేమి వీరికోరికగూడ వర్ణసాంకర్యకరణమునకుఁ గంకణముగట్టుకొనియున్న సంఘసంస్కారుల ప్రయత్నమునకె తోడుపడుచున్నది. కావునఁ బైశ్లోకమునకు మనసోదరులుసల్పినయర్థము మేము వెనుకఁదెలిపిన శ్రుతి స్మృతి సూత్ర పురాణేతిహాసజ్యోతిశ్శాస్త్ర సుశ్రుత నిఘంటువచనములకు నెల్లఁ బరమవిరోధిగానున్నది. ఇంతియగాక వీరియర్థము

వ్యాకరణశాస్త్రము

గావించిన యర్థమునకు విరుద్ధముగానున్నది. చూడుఁడు,సిద్ధాంతకౌముదిని నపత్యాధికారమునందు (6-4-171) బ్రాహ్మోఽజాతౌ అనుపాణిని సూత్రమునకు భట్టోజిదీక్షితు లిట్లువృత్తిని జేసియున్న వారు. " యోగవిభాగోత్రకర్తవ్యః బ్రాహ్మఇతి నిపాత్యతే అనపత్యేఽణి-

బ్రాహ్మం హవిః తతో జాతౌ అపత్యే జాతా వణి బ్రహ్మణష్టిలోపో నస్యాత్-బ్రహ్మణో౽పత్యం బ్రాహ్మణః అపత్యే కిం బ్రాహ్మో ఓషధిః” అనియున్నది. ఇందు బ్రహ్మశబ్దమునకుఁ బున్నపుంసకరూపములు రెండు కలవనియు వానిలో నపుంసకలింగరూపక బ్రహ్మశబ్ద మనపత్యార్థకమునందువచ్చుననియుఁ బుంలింగరూపక బ్రహ్మశబ్ద మపత్యార్థకమునందు వచ్చుననియుఁ దెలియవచ్చుచున్నది. దీనివలననపుంసకలింగమైనపుడు బ్రహ్మయనివాడవలెనని యుండుటచేతనే చిన్నయసూరి బాలవ్యాకరణమునఁ దత్సమపరిచ్ఛేదమందున 76వ సూత్రముచే “ మహదర్థవాచకమై పుంలింగంబగు బ్రహ్మశబ్దంబునకు స్త్రీత్వంబగు. బ్రహ్మ, ఈశబ్దము చతుర్ముఖ ఋత్విగ్విప్రులకు వాచకంబు తత్త్వతపోవేదయోగవాచకంబగునేని బ్రహ్మమునాఁబడు” అనినుడివియున్నవాఁడు. ఇఁక నపత్యార్థకమందు బ్రహ్మశబ్దము పుంలింగంబనియు బ్రహ్మయొక్కసంతానము బ్రాహ్మణుఁడగుననియు విశదమగుచున్నది. కావునమనసోదరులు పైశ్లోకమునకు జన్మచేత శూద్రుఁడగువాఁడు కర్మచేద్విజుఁడై వేదపారముచే విప్రుఁడై బ్రహ్మజ్ఞానముచేత బ్రాహ్మణుఁడగునని కావించినయర్థ మపార్థమని యిద్దానివలన స్పష్టమైనది. అట్లైనఁ బైశ్లోకము బ్రాహ్మణజాతికిమాత్రమే సంబంధించునని మీరునచించినవచనము నిరర్థకముకాదాయని యందురా? కాదు. ఏలయన? జన్మచేత శూద్రుఁడై పుట్టుచున్నాఁడనఁగా బ్రాహ్మణబాలుఁడుపనయనమునకుఁ బూర్వమున శూద్రప్రాయుఁడని భావము. వానికి నుపనయనసంస్కారముచే ద్విజత్వముకలుగును-ద్విజుఁడై వేదాధ్యయనముగావించి విప్రుఁడగును-వేదమనఁగా జ్ఞానము. జ్ఞానమునార్జించి తనను లోకమునుగూడఁ బాపములనుండి రక్షింపఁగలశక్తి సంపాదించుటచే విప్రుఁడగుచున్నాఁడు. కావుననే విప్రః=విశేషేణ పాపేభ్యః ఆత్మానం పరంచ పాతీతి విప్రః,పారక్షణే. తన్నుఁబరుని విశేషముగాఁ బాపమునుండి రక్షించువాఁడు. అని గురుబాలప్రబోధిక పలికియు

న్నది. ఇట్లు విప్రుఁడై బ్రహ్మజ్ఞానము సంపాదించుకొని బ్రాహ్మణుఁడగును. అనఁగా ఆవిప్రుఁడు "ఆత్మావై పుత్రనామాసి" అను శ్రుత్యర్థానుసారముగా సిద్ధాంతకౌముది చెప్పినట్లు బ్రహ్మపుత్రుఁడు బ్రాహ్మణుఁడగునను నర్థమునకు గుఱియగునని భావము. ఈవిమర్శవలన మేము తొలుతఁ జెప్పినట్లు "జన్మనాజాయతేశూద్ర" యనుశ్లోకము బ్రాహ్మణజాతికిమాత్రము సంబంధించునని తేలినది.

ఇఁక మూర్తిగారి ప్రశ్నార్ణవమందలి రెండవసారాంశముం గూర్చి చర్చించుకొందము అదేమన?

శాస్త్రములు గుణకర్మలనుబట్టి వర్ణవిభాగమును గావించినవి అనునది. ఈ రెండవసారాంశమును మనమూర్తిగారు శాస్త్రమర్యాదనెఱుంగమిని దెల్పియున్నవారు. శాస్త్రములు గుణకర్మలనుబట్టే వర్ణవిభాగము నెప్పుడును గావించియుండలేదు సృష్టియందే వర్ణవిభాగముగలదను ప్రమాణములనెల్ల నీవఱకుఁ జూపియున్నవారము. అట్లువిభజింపఁబడినవర్ణములకుఁ బ్రత్యేకముగా గుణకర్మలచుఁ బరమేశ్వరుఁడే సృజించినట్లు మనశాస్త్రములు ఘోషించుచున్నవి చూడుఁడు మనుస్మృతిప్రథమాధ్యాయము 87 వశ్లోకము. "సర్వస్యాస్యతుసర్గస్య గుప్త్యర్థం స మహాద్యుతిః। ముఖబాహూరుపజ్జానాం పృథక్కర్మాణ్యకల్పయత్॥" ఆ మహాతేజస్స్వభావుఁడగు బ్రహ్మ సర్వసృష్టిసంరక్షణకొఱకుఁ దన ముఖబాహూరుపాదములవలనఁ బుట్టినవారల (బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులకు) వేఱువేఱుకర్మలను సృజించెను. అనియర్థము. అవేవన? ఆశ్లోకమువెంటనే (88 వశ్లో: ము "అధ్యాపనం చాధ్యయనం యజనం యాజనం తథా దానం ప్రతిగ్రహంచైవ బ్రాహ్మణానామకల్పయత్॥ చదివించుట చదువుట యజ్ఞముచేయుట, చేయించుట దానమిచ్చుట పుచ్చుకొనుట అను నాఱుకర్మలను బ్రాహ్మణులకొఱకు సృజించెను. ప్రజానాంరక్షణంగాన మిజ్యాధ్యయనమేవచ। విషయేష్వ ప్రసక్తిశ్చ, క్షత్రియస్యసమాసతః ("రాజులకుఁ బ్రజారక్షణము దానము యజ్ఞము

చేయుట వేదముచదువుట కామాదివిషయములందు మనస్సుంచకపోవు
ట లోనగువానిని గల్పించెను.(90వశ్లోకము) పశూనాంరక్షణం దాన మి
జ్యాధ్యయనమేవచ వణిక్పథం కుసీదంచ, వైశ్యస్య కృషిమేవచ" వైశ్యు
నకుఁ బశుసంరక్షణము దానము యజ్ఞముచేయుట వేదాధ్యయనము
వర్తకమునరించుట వడ్డీతీయుట సేద్యముజేయుట అనువానిని నే
ర్పాటుఁ జేసెను.(91శ్లోకము)ఏకమేవతుశూద్రస్య ప్రభుః కర్మ సమాది
శత్,ఏతేషామేవవర్ణానాం శుశ్రూషామనసూయయా" శూద్రునకుఁ
బైమూడువర్ణములవారికిని నసూయారాహిత్యముచేత సేవచేయుటను
ముఖ్యధర్మముగా నాప్రభువైన బ్రహ్మ యేర్పరచెను" అని మను వ
సియున్నవాఁడు.దీనింబట్టి నలువతొలుత బ్రాహ్మణాదిజాతిచతుష్ట
యమునుసృజించి పిదప నాయాజాతుల సంరక్షణార్థమయి
పూర్వోక్తకర్మలనుఁ గల్పించినట్లు స్పష్టమగుచున్నది. శాస్త్రము లిట్లు
చెప్పుచుండఁగా మన మూర్తిగారు ప్రశ్నార్ణవమున 10 వ పుటను
"ఇల్లుకాలినను చింతలేదు. ముగ్గుచెడకాదనునట్లుగా నెట్టిదుర్గుణ
దుష్కర్మ దుస్స్వభావులైనను బుట్టుకతో ద్విజుఁడన్నఁ జాలునట!
ఎంతటి గౌరవాధిక్యములగు గుణములున్నను శూద్రుఁడు శూద్రుఁడే
యట!" యను పరిహాసోక్తులను వ్రాసియున్నవారు. వీ రెట్లువ్రాసికొని
నను వ్రాసికొందురుగాక! దుర్గుణ దుష్కర్మలు గల బ్రాహ్మణుఁడు
దుర్బ్రాహ్మణుఁడగునుగాని స్వజాతిదూరుఁడై శూద్రుఁ డెన్నటికిని
గానేరఁడు. ఇట్లే సద్గుణసత్కర్మలుగలశూద్రుఁడు సచ్ఛూద్రుఁడగును
గాని బ్రాహ్మణాద్యుత్తమజాతియుఁ డెన్నటికినిఁ గానేరఁడు. ఆపస్తం
బమహర్షి చెప్పినట్లు స్వజాతిధర్మానుష్ఠానముచేత మఱియొకజన్మమునందు
నుత్తమజాతిసంభవుఁడగునని యెఱుంగవలయును. ఈయర్థమునే
యైదవవేదమగు మహాభారతారణ్యపర్వమునందు ధర్మరాజు నహు
షప్రశ్నల కుత్తరములనిచ్చు సందర్భమున విశదీకరించియున్నవాఁడు.
"ఘనుఁడ! యేగుణములు గలవాఁడు బ్రాహ్మణుండతని కెఱుఁగఁదగి

నయట్టివస్తు వెద్ద దీని నాకు నెఱిఁగింపుమనిన నిట్టనుచుఁజెప్పెఁ బాం
డవాగ్రజుండు " సత్యక్షమాదమ శౌచదయాతపోదానశీలంబు లెందేనిఁ
గ్గాన । నగునట్టివాఁడు బ్రాహ్మణుఁడు **సుఖంబు** దుఃఖము నైనయెడ
విమోహమునుబొందకునికియ వానికి నుత్తమంబగువిద్యయనిన నీచెప్పి
నయగ్గుణములుక్రియ శూద్రునందుఁగల్గిన నతం డుత్తమద్విజుఁడుగా
నేర్చునె నిజమువిడిచి।నట్టులయిన, బ్రాహ్మణాదివర్ణవిభాగ । మెట్లుక్కలు
గునయ్యో హీను లధికు। లను వివేక మది యపార్థకంబగుగాదె । యనిన
ననియె నంతకాత్మజుండు " ప్రమాదంబున వర్ణసంకరంబైనప్పుడు వర్ణ
పరీక్షార్థంబుగా బ్రాహ్మణులకు వృత్తంబు వేఱువేఱ స్వాయంభువుం
డైన మనువు సెప్పె సత్యాదిగుణంబులు శూద్రునందుఁగలిగె నేని
వాఁడు సచ్ఛూద్రుండగుఁగాక బ్రాహ్మణుండుగానేర్చునే యవియు
బ్రాహ్మణునందు లేనివాఁడు శూద్రుండయనంబడుఁ గావున వృత్తంబుల
యుత్తమంబులు." అని స్పష్టముగాఁదెలిపియున్నవాఁడు. కావున మన
శాస్త్రములు గుణకర్మలనుబట్టి వర్ణవిభాగముగావించినవను మన
మూర్తిగారి రెండవసారాంశము శాస్త్రబాహ్యమైనదని నిరూపించిన
ట్లీవిమర్శవలనఁ దేలినది ఇఁక మూర్తిగారి మూడవసారాంశమును
గూర్చి ముచ్చటించుకొందము. అదేమన ?

(3) "గుణకర్మలనుబట్టియే వర్ణవిభాగముగావింపఁబడినట్లు పూ
ర్వనిదర్శనములుగలవు" అనునది.

ఇందులకుఁ దార్కాణముగా మనమూర్తిగారు ప్రశ్నార్ణవము
14వ పుటను "ఐతరేయ కవష ఐలూష పృషధ కరూష నాభాగ
ధృష్ట అగ్నివేశ్య రథీతర హారీత శౌనక గృత్సమతి గృత్సమద వీతహ
వ్య మున్నగు ఋషులందరు అన్యవర్ణమునుండి బ్రాహ్మణులైరి కావున
వర్ణము బుట్టుకతో రాదు. గుణముతోడ వచ్చును. శౌనకపుత్రులు
నలుగురు నాలుగువర్ణములవారైనటు విష్ణు వాయు హరివంశాది
పురాణములందుఁ గలదు" అనువాక్యములను ప్రదర్శించియున్నవారు.

వీరునుడివినట్లు మహర్షులలోఁ గొందఱు విపరీతజన్మలుకలవారైనట్లు మనపురాణములందు వర్ణింపఁబడియున్నమాట మాత్రముసత్యము" ఐన వారిజన్మములను ప్రమాణములుగాఁ గైకొనుటచే మనమూర్తిగారికి గలిగెడి ఫలమేమి? యని మనము ప్రశ్నించిన వెంటనే మూర్తిగారు "బెస్తదానియందు వ్యాసుఁడును గణిక(వేశ్య)యందు వసిష్ఠుఁడును,(లోనగువారు) నీచ జాతిస్త్రీలయందు బుట్టి గుణకర్మలనుబట్టి బ్రాహ్మణ జాతియందు జేర్పఁబడియుండలేదా? యని సమాధానముచెప్పవత్తురు. అది సత్యమే వారిజనకులు మహర్షులై తమ తపోమహిమలచే నీచస్త్రీ క్షేత్రములను నిమిత్తములుగానిడికొని సిద్ధవిర్యులుగాన వీర్యప్రధాన మగు తమజాతిసంతానమునే కనియున్నవారు. ఆబాలు రుదయించినది మొదలు బ్రాహ్మణులుగా బురాణములందు వర్ణింపఁబడియుండిరేకాని దయానందసరస్వతీస్వామి, మూర్తిగార్లు చెప్పినట్లిరువదియైదుసంవత్సరములయీడువచ్చినమీఁదట గుణకర్మలనుబట్టి బ్రాహ్మణజాతియందుఁజేర్చఁబడినట్లెచ్చటను గానరాదుకాన వీరివాద మసంగతము.

పోనిండు వాదమునిమిత్త మించుకసేపు వీరుచెప్పినట్లు నీచస్త్రీలయందు బుట్టినమునులందఱు గుణకర్మలనుబట్టి యుత్తమజాతియందు జేర్పఁబడినట్లొప్పుకొందము. ఒప్పుకొనినను నామహర్షులవలె మనము నిప్పుడు నీచజాతిస్త్రీలయందు జనించినబాలురను గుణకర్మలనుబట్టి విభాగించి బ్రాహ్మణజాతియందు జేర్చుకొనుట యనుచితమని యేచెప్పితీరవలయును. ఏలయందురా? సిద్ధవీర్యులగు మహర్షులు నీచజాతిస్త్రీలయందుమాత్రమే స్వజాతివిహితసంతానమును గనియుండలేదు ఇఁకేమన? మనుష్యేతర తిర్యగ్జంతుసంతానమం దుఁగూడ మానవజాతిసంతానమును గనినట్లు పురాణములందు వర్ణింపఁబడియున్నది. ఆపుట్టినవారు సామాన్యజాతివారునుగూడఁ గారు. మహర్షివరేణ్యులై యున్నవారు. వారెవరందురా? చూడుఁడు. (భవిష్యమహాపురాణము 42వ అధ్యాయము)" హరిణీగ

ర్భసంభూత ఋష్యశృంగో మహాముని:। తపసా బ్రాహ్మణో జాతః, సంస్కార స్తేన కారణం,॥ ఉలూకీగర్భసంభూతః కణాదాఖ్యో మహాముని:। తపసా బ్రాహ్మణో జాతః, సంస్కార స్తేన కారణం,॥ "మఱియొకచోట "శుకా శ్శుకః కణాదాఖ్య స్తథోలూక్యా స్సుతో భవత్। మాండవ్యో మునిరాజస్తు మండూకీగర్భసంభవః" అనఁగా లేడికడుపున ఋష్యశృంగుఁడును గ్రుడ్లగూబయందు కణాదుఁడును జిలుకయందు శుకుఁడును కప్పయందు మాండవ్యుఁడును బుట్టిరనియు వారు తపస్సుచేత బ్రాహ్మణజాతీయులైరనియుఁ గావునఁ సంస్కారము కారణమునియు నర్థము" దీనివలన మహర్షులు మానవేతరజంతువులందు మానవోత్తములగు బిడ్డలను గనినట్లు తెలియవచ్చుచున్నది. ఆమహర్షులునడిచినట్లు మనమును నడువవలయునేని వారివలె మనమును మానవేతరజంతువులందు మానవోత్తములను గనకపోయినను సామాన్యమానవులనైనఁ గనవలెనుగదా? కనవలెను. అటులేని మన యార్యధర్మోపదేశకులగు మూర్తి ప్రభృతులు వట్టియుపదేశములతోఁ గాలయాపనముఁ జేయక మన మహర్షులవలెనే 'మార్గదర్శీ మహర్షిః"యను న్యాయానుసారముగా మానవేతరజంతువులందు (చిలుక, జింక, కప్ప కుక్కలందు) మానవసంతానమునుగనుటకుఁ బ్రయత్నించి మార్గదర్శులగుదురుగాత! అంతవఱకు నిట్టి విపరీతవాదములను గట్టిపెట్టుదురుగాత!

ఈపైవిషయమునందు మార్గదర్శులైనవెంటనె మన మూర్తి ప్రభృతులు తొల్లింటిమునిసత్తములవలె మఱియొకవిధమయిన సృష్టినిఁ గావింపవలసియున్నది. అదేమన? భారతమునందుఁ గృపద్రోణద్రుపదులజన్మంబు లిట్లువర్ణింపఁబడియున్నవి. చూడుఁడు. భారతాదిపర్వము.

బులే, దీ యజ్ఞంబుమాని క్రియాయజ్ఞంబులుసేయువారు మహాయావృతులు, కర్మయజ్ఞంబుచేతముక్తిగోరువారు సూర్యుండులేకుండఁ దమంబుచేతం జూడంగోరువారు, బ్రాహ్మణులైన నంత్యజులైన జ్ఞానయజ్ఞప్లవంబున సంసారవారిధిందరింతురు, మఱియును. 82

సీ॥ అమలశివజ్ఞానయజ్ఞవైభవమార్గ
మరయక మర్త్యు లద్వైతమునకు
యత్నంబుసేయుదు రలవియె తెలియంగ
దేవతలైనను దెలియలేరు
సర్వజ్ఞుఁడైనట్టి శంకరుం డెఱుఁగుఁదా
నితరులెఱుంగఁదా రెంతవారు
సర్వధన్యాధన్యులు శంకరభక్తులు
రుద్రప్రసాదైక రూఢివలన
జ్ఞానయజ్ఞప్రభావంబు పూని తెలియు
వారుగాని ప్రసాదవైభవము లేని
పాపకర్ములు తెలియఁగా నోపరెందు
సాధనంబులు దెలియుమి సత్యమిదియు॥ 83

తే॥ జ్ఞానయజ్ఞంబుగలయట్టి మానవులకు
దుర్లభంబును హేయంబుఁ దోఁచ దెందు
సర్వమును బ్రహ్మమైతోఁచు సత్యముగను
తన్మహత్త్వంబు వర్ణింపఁదర మెనాకు॥ 84

తే॥ జ్ఞానయజ్ఞప్రభావంబు మానులకును
దేవతల కన్యులకునైనఁ దెలియవశమె
సర్వవిదుఁడైన శివునకు శక్యమగును
సందియము లేదుదీనికి సత్యమిదియు॥ 85

—• జ్ఞానయజ్ఞవిశేషములు •—

క॥ మఱియును విజ్ఞానాభిధ
పరమమహాయజ్ఞమహిమఁ బలికెద, వీరల్

పరమప్రీతినివినుఁ, డిది
పరమసుఖానందకరము బ్రాహ్మణులారా! 86
సీ॥ పాసఁగ ధర్మాధర్మములు తత్ఫలంబులు
భూతపిశాచసంఘాతములును
గలవనుబుద్ధియుఁగలవారుసుజ్ఞాను
లనినాదునిశ్చయం బనఘులార!
యక్షరాక్షసులును యమివర్యులును బర
లోకంబు యముఁడును నాకవిభుఁడు
గలరనుబుద్ధియుఁ గలితవిజ్ఞానంబ
యని నాదుబుద్ధి, యీయమరవితతి
కంటె విధియెక్కుఁ డతనిపైఁ గమలనయనుఁ
డతనిపై రుద్రుఁ డాతనికవల నీశుఁ
డతనికంటె సదాశివుఁ డధికుఁడనెడి
బుద్ధిగలవారలును జ్ఞానపూర్ణులరయ! 87

వ॥ మఱియుఁ దమోగుణోపాధకుండగు రుద్రునికంటె నీతుణోపాధివిశిష్టంబగు పరశివచైతన్యం బుత్తమం బంతకంటె శుద్ధసత్త్వప్రధానమాయోపాధకపరశివచైతన్యం బుత్తమం బంతకంటె దత్కారణంబయి స్వప్రతిష్ఠంబగు పరశివచైతన్యం బుత్కృష్టంబగు నాకారణోపాధివిశిష్టంబును సోపాధికంబును నగు సర్వంబుకంటెఁ గారణోపలక్షితంబును సచ్చిదానందైకరసంబును నగు పరశివస్వరూపం బధికం బగునని శాస్త్రప్రమాణంబుగా నెవ్వరెఱుంగుదురు వారలు విజ్ఞానసంపన్నులని నామతంబు, శివుండుకలఁడనియుఁ బ్రాణేంద్రియమనంబులకును క్షణప్రధ్వంసివిజ్ఞానబుద్ధ్యహంకారములకును బరుండనియుఁ బ్రమాణంబునం దెలిసిన వారలు విజ్ఞానసంపన్నులగుదురు, జాగ్రత్స్వప్నసుషుప్త్యాఖ్య ధామత్రయసాక్షియు సత్యజ్ఞానానందాదిలక్షణంబును ద్వమహాంశబ్దలక్ష్యార్థంబును సర్వదోషరహితంబును జ్ఞాతాజ్ఞాత

ద్వయాతీతంబును దద్భాసకంబును బ్రమాణభ్రాంతివృత్తుల కగమ్యం
బును దత్ప్రకాశకంబును స్వయంప్రభంబును నిరాధారంబును నగు
నాత్మను సునిశ్చితంబుగా నెవ్వరెఱుంగుదురు వార విజ్ఞానసంపన్ను
లని నానిశ్చయంబు. 88

తే॥ ఉక్తలక్షణజీవేశయుగము నొకటి
గాఁగఁ దర్కప్రమాణయుగ్మంబు చేత
స్వానుభూతిని సద్గురువచనమునను
దెలియువారలు విజ్ఞానకలితులెందు॥ 89

తే॥ మఱియు విజ్ఞానయజ్ఞంబు మానులార
పరమకళ్యాణమిది తేటపడఁగ వేగఁ
దెలిపెదను భక్తిచేతను దనివినిన
(సరవిసిద్ధించుమీకు మోక్షంబువినుఁడు)॥ 90

తే॥ బ్రిహ్మమిటు లాత్మశక్తిసంబంధ(మునను)
నేకమయ్యును భిన్నమైయెసఁగి సత్స్వ
రూపమయ్యు నసద్రూపరూఢిగల్గి
పరఁగ సంసారివలెఁ దోఁచుఁ బ్రాజ్ఞులార॥ 91

చ॥ తనర నభిన్నమైన పరతత్త్వమునందునఁ జేతనంబచే
తనమను భేదముంగలిగెఁ ,దథ్యముగాదిది, శక్తియోగసం
జనితము,యీశ్వరాదితృణజాలముగాకను మాయచేనచే
తనమును భేదముం గలిగెఁ దత్పరమాత్మునిచేతనంబునన్॥ 92

వ॥ మఱియు నుత్కర్షాపకర్షంబులును నియంతృత్వనియామ్య
త్వాకారంబులును బ్రిహ్మచేతనంబున మాయాబలంబునఁగల్పితంబుల
య్యె, సర్వదిక్కులయందును వ్యవహారనిమిత్తంబులైన వర్ణాశ్రిమంబు
లును దద్ధర్మంబులును దత్ఫలంబులును దత్సాధనంబులును రాగద్వే
షాదిదోషంబులును శాంత్యాదిగుణంబులును మహేశ్వరజ్ఞానంబున
వైదికలౌంతిరికాపభ్రింశంబులును నస్తినాస్తిభావంబులును మహా

డాదిశూన్యపర్యంతంబైనజగంబుసర్వంబును నంబికాభర్తయు మహా
దేవుండునగు శివుని మాయచేతం గాలకర్మవిపాకంబునం గల్పితంబయ్యె,
నింక సమ్యగర్థనిరూపణంబుచేసిననిట్లుమాయాకల్పితంబైనయీ సర్వం
బును శివుండెయగు, సూక్ష్మధర్మంబునఁజూచిన నన్యంబుగాదు మఱి
యును.

తే॥ అట్లుగావున సంక్షిప్తమైనదీని
వినుఁడు చిదచిద్విభిన్నమౌ విశ్వమెల్ల
శివునిశక్తి జనించితా శివమయంబె
యగునుగా కెందువేఱుగా దనఘులార! 94

క॥ అనిమఱియు సూతుఁడిట్లను
మునులార! రహస్యతరము ముఖ్యము సూక్ష్మం
బును నగు యోగజ్ఞానము
వినిపింతువినుండుమీరు విశదశ్రద్ధన్॥ 95

వ॥ చిన్మాత్రాశ్రయమైనమాయ(యొక్క)శక్త్యాకారంబునన
నుప్రవిష్టయు సంవిద్రూపయు నిర్వికల్పయుస్వయంప్రభయుసదాకార
యు పరానందయు సంసారచ్ఛేదకారిణియు శివాభిన్నయు శివంకరి
యుఁ బరయు శివాభిధానయు నగు నమ్మహాదేవి జగత్కారణత్వం
బువహించె,శివున కామహాదేవి శక్తియయ్యె,నది లేకున్న నిరర్థకుండగు
నాశివుండే సాక్షాదుపాధిచేత సర్వజ్ఞత్వంబునొందె,నదియునాతని శక్తి
యయ్యె,నది లేకున్న నిరర్థకుండగు,నాశివుండె సాక్షాదుపాధిచేత నీశి
తృత్వంబునొందె, నదియునాతనిశక్తియయ్యె,నది లేకున్న నిరర్థకుండగు,
మఱియు నాశివుండు రుద్రత్వవిష్ణుత్వబ్రహ్మత్వసదాశివత్వేశ్వరత్వ
హిరణ్యగర్భత్వ సూత్రాత్మత్వ విరాడ్రూప స్వరాడ్రూప సంమ్రా
డ్రూపేంద్రాదిలోకపాలరూప వేదాదిరూపేశ్వరత్వ మనుష్యత్వ
తిర్యగాదిరూప భోజ్యాభోజ్యాదిరూ పౌషధీస్వరూప నదీనదరూప
పర్వతరూప సముద్రరూప విద్యుద్రూపంబు లాదిగాఁగల సర్వరూ

## ప్రధానపోషకులు.

1 శ్రీ శ్రీ జగద్గురు విరూపాక్ష స్వాములవారు.

2 రాజా బెలఘురవల రాఘవేంద్రరావు బహద్దూర్,
జాగీరుదారుగారు, నవాబుపేట.

### ఈసాల సహాయ్యము చెల్లించిన చందాదారులు.

1 పాటిబండ సూర్యనారాయణరావుగారు, వకీలు, గుంటూరు.
2 అంగర వెంకట్రావుగారు, వకీలు, నర్సారావుపేట.
3 నిమ్మరాజు వెంకట్రామయ్యగారు, యనమదల
4 వుల్చి రామయ్యగారు పేరికలపూడి
5 జంధ్యాల నారాయణమూర్తిగారు సబ్ డివిజనాపీసరు మద్రాసు
6 ముటుకూరి గోపాల కృష్ణయ్యగారు కరణం ముటుకూరు
7 రొంటాలపున్నయ్యగారు మాడుగుల
8 చెన్నపురాంధ్రసభ, మద్రాసు
9 హిందూ యువజనసంఘము ఏలూరు
10 ఉరుపుటూరి చక్రవర్తుల లక్ష్మణాచార్యులుగారు వూరి
11 యనమండ్ర రామమూర్తిశాస్త్రిగారు బెజవాడ.
12 శ్రీ వేంకటరమణనివాస లైబ్రరి తిరుపతి.
13 కాశిరాజు సుబ్బారాయుడుగారు కైవూరు.
14 దోర్బిణా సోమయ్యగారు సర్వవరము.
15 మంత్రిప్రెగడ మట్టుపల్లినరసింహారావు జమిందారుగారు, లింగగిరి.
16 చెన్నూరు పిచ్చయ్య దేశముఖుగారు పెదవీడు.
17 ధూళిపాళ అనంతయ్యగారు మర్రింపల్లి.
18 కొండపల్లి సుందరరామయ్యగారు, కరణం వేమవరం.
19 తడికమళ్ల సీతారామారావు దేశముఖుగారు పెనుబాడు.
20 జానపాటి వెంకటప్పయ్యగారు వేమవరము.
21 దిడుగు కాంతయ్యగారు కొదమగుండ్ల.
22 పిశుపాటి వెంకటనరసింహశాస్త్రిగారు రివిన్యూఇన్స్పెక్టరు బాపట్ల

# అభినవసరస్వతి.

## పత్త్రికాధిపతి జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది త్రైమాసపత్త్రిక, ప్రాచీననవీనాంధ్ర ప్రబంధములును, నాటకములును, విమర్శనములును, విద్యావిషయిక మతవిషయిక వ్యాసములును ప్రకటింపఁబడును ప్రాజ్ఞసమ్మతములగు తాత్కాలికవ్యాసములవలనఁ గలుగు నానందముగాఁక చందాదారులకు సం॥కు 2-3 అపూర్వగ్రంథము లలవడును చందా సం॥ 1కి, రు 2-0-0

### ఈకార్యస్థానమున వెలకుదొరకు పుస్తకములు.

| | | |
|---|---|---|
| 1 | ఆళ్వయాచార్యవిజయము | 0-4-0 |
| 2 | కరిణీకోద్ధారిణి (పూరెవీరభద్రకవి) | 0-4-0 |
| 3 | వాసంతికా పరిణయము } ఇవి రెండునాటకము .. | 0-4-0 |
| 4 | కంసవధము .. | 0-8-0 |
| 5 | చమత్కారమంజరి (సింహాద్రి వెంకటాచార్యులు) .. | 0-4-0 |
| 6 | విరూపాక్షపీఠగురుపరంపర .. | 0-2-0 |
| 7 | నీతిగీతులు (సుమతి శతకమునకు సంస్కృతము) ... | 0-2-0 |
| 8 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము .. | 0-2-0 |
| 9 | విగ్రహారాధనఖండనఖండనము ... ... | 0-4-0 |
| 10 | చిత్తూరుజిల్లాతీర్పు విమర్శనము (పత్త్రికాధిపతి) ... | 0-4-0 |
| 11 | సంగదోషము ... ... | 0-8-0 |
| 12 | వీరభాగవతము (ముదిగొండవీరభద్రకవి) ... .. | 1-4-0 |
| 13 | పుళిందావివాహము (పత్త్రికాధిపతి .. ... | 0-4-0 |
| 14 | గురిగింజ, వత్సలనీతిశతకము, వ్యాసనిష్కాసనము, పిష్టపేషణము ... | 0-4-0 |
| 15 | శివానందలహరి (తంగెడ రామకృష్ణకవి) ... .. | 0-4-0 |
| 16 | లక్ష్మీవిలాసము (రాయసము వెంకటపతి) .. . | 0-4-0 |
| 17 | నర్సారావుపేట శతావధానము (తిరుపతివెంకటీయము) .. | 0-3-0 |
| 18 | పశ్యాంపుశ్యాం ,, .. .. | 0-2-0 |
| 19 | పశ్యశబ్దవిచారము ,, .. .. | 0-2-0 |
| 20 | పురశ్చరణము ,, ... . | 0-2-0 |
| 21 | అత్యద్భుతవిమర్శనము, (ఇది వెంకటరామకృష్ణకవుల అవధానముల పైవిమర్శనము) . . .. | 0-5-0 |
| 22 | శంతనురాజచరిత్ర ... ... ... | 1-14-0 |
| 23 | రజస్వలావివాహఖండనము .. . .. | 0-8-0 |

అభినవసరస్వతీ కార్యస్థానము.

జానపాడు-పిడుగురాళ్ళపోష్టు, గుంటూరుజిల్లా.